

# పండిత గోపదేవ్

| | |
|---|---|
| జననము | : క్రీ.శ. 1896 మరణం : 1996 |
| జన్మస్థలము | : కూచిపూడి, తెనాలి తాలూకా |
| జననీజనకులు | : శ్రీ అంబమాంబా రామయార్యులు |
| విద్యాభ్యాసము | : కూచిపూడి,అమృతలూరు, కాశ్యాదిపీఠములు, సంస్కృతాంధ్ర హిందీ సాహిత్యములు |
| అభిమాన విషయములు | : షడ్ దర్శనములు, నైష్ఠిక బ్రహ్మచర్యము, యోగమార్గ ప్రావీణ్యము |
| స్థాపకులు | : అంబా దర్శన గ్రంథమాల, కూచిపూడి,అంబా రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు, సికింద్రాబాద్ మరియు ఎన్నో ఆర్యసమాజములు |

సన్మానములు :

1. "కళాప్రపూర్ణ" – ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్టణం
2. రూ. 10,000/– "మహర్షి దయానంద సరస్వతి నిధి పురస్కార్" న్యాస్, ఆర్యసమాజం, ఫలేరా
3. రూ.5,001/– ఆర్యప్రతినిధి సభ, ఆంధ్రప్రదేశ్, సుల్తాన్ బజార్, హైదరాబాద్.
4. రూ. 25,000/– వేదవేదాంగ పురస్కార్, ఆర్యసమాజము, శాంతాక్రూజ్, బొంబాయి
5. రూ. 1,00,000/– శత జయంతి సందర్భముగా "దర్శన తత్త్వవేత్తా" బిరుదు – శతజయంతి ఉత్స సమితి, సికింద్రాబాద్. తేది. 30-7-1995

రచనలు,అనువాదములు : సత్యార్థ ప్రకాశము,ఋగ్వేదాది భాష్యభూమిక, నిరుక్తము, ఋగ్వేద భాష్యభాస్కరముI,II,III, వైదిక వినతి I, II, వైదిక దినచర్య, న్యాయ మొ॥ 5 దర్శనములు,ఈశ, కేన మొ॥ 11 ఉపనిషత్తులు, ఆస్తికవాదము, అర్థధర్మ మీమాంస, సంస్కారవిధి, భగవద్గీత, ఏసుక్రీస్తు రహస్య జీవనము, పూజ, వైదిక పర్వ పద్ధతి, అపశూద్రాధికరణము మొదలగునవి చిన్న గ్రంథములు 25 (నాలుగు భాగాలలో) చిన్నవి,పెద్దవి కలిపి ఆఱువదికి పైగా వైదిక గ్రంథములు తెలుగులో రచించినవారు వీరొక్కరె.

ఓం

# స్వరాజ్య సంగ్రామములో
# ఆర్య సమాజము



హిందీమూలం :

**పం. ఇంద్రజీ విద్యావాచస్పతి**

(పూర్వ పార్లమెంట్ సభ్యులు)

అనువాదకులు :

**కళాప్రపూర్ణ పం. గోపదేవ్ శాస్త్రి**

**గాయత్రి ఆశ్రమ ట్రస్టు ప్రచురణ**
వ్యాస్ వైదిక సేవా సమాజము
12-10-586/6, వ్యాస్‌నగర్, (ఇందిరానగర్ రోడ్డు, నెం. 2)
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 500 061.

గాయత్రీ గ్రంథమాల - 36
ప్రతులు - 1000

సృష్టి సంవత్సరము : 197,29,49,102
విక్రమాబ్దము : 2058
దయానందాబ్దము : 178
శ్రీ చిత్రభాను సం॥ యుగాది (2002)

మూల్యము : రూ. **8=00** (తపాల ఖర్చులు అదనము)

తపాల ద్వారా ప్రతులకు :
శ్రీ బాసెట్టి సత్తయ్య, జె -38, రాంగోపాల్‌పేట, సికింద్రాబాద్.

ప్రతులకు :

1) గాయత్రీ ఆశ్రమము, వ్యాస్ వైదిక సేవా సమాజము
12-10-586/6, వ్యాస్‌నగర్, (ఇందిరానగర్ రోడ్డు, నెం. 2)
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 500 061.

2) మాశెట్టి శ్రీనివాస్, Shop No. 5, మాశెట్టి బిల్డింగ్,
3–3–736 to 740 , కంచరి బజార్, సికింద్రాబాద్ - 3. ఫోన్ : 6320200

3) ఆర్ష గురుకులము, వడ్లూరు, కామారెడ్డి - 503 111 (నిజామాబాద్ జిల్లా)

4) వైదిక సాహిత్య భండార్, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 95.

5) ఆర్. కృష్ణమూర్తి, బుక్ సెల్లర్స్, ఆర్యసమాజము,
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 61.

6) ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా)

Designed & Printed at
PRINTSHOP
Sec'bad. Ph : 63203(





# మాతృభూమికి వందనము













ఉపస్థాస్తే అనమీవా అయక్ష్మా
అస్మభ్యం సన్తు పృథివి ప్రసూతాః ।
దీర్ఘం న ఆయుః ప్రతిబుధ్యమానా
వయం తుభ్యం బలిహృతః స్యామ ॥
(అథర్వ. 12-1-62)






ఓ మాతృభూమీ ! నీ చల్లని ఒడిలో వేమంతా రోగరహితులమై క్షయరహిత యౌవ్వనము గలవారమై దీర్ఘాయువు ననుభవింతుము గాక !






ఓ మాతృభూమీ! నీ రక్షణకై మా తను మనో ధనములను బలిగా (సేవా ధర్మముగా) నర్పింతుముగాక !







# ఓ3మ్

# ప్రకాశకీయము

మా గాయత్రీ ఆశ్రమ న్యాసము(ట్రస్టు) నుండి యింతకు పూర్వం "స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు' అను లఘుపుస్తకము ప్రచురించియుంటిమి. ఆ వరుసలోనే ఈ పుస్తకమును ప్రచురించు చున్నాము. ఈ వ్యాసకర్త పం. ఇంద్రవిద్యావాచస్పతిగారు, ప్రముఖ స్వాతంత్ర్య యోధులు స్వామి శ్రద్ధానందులవారికి తగిన పుత్రుడు. తండ్రిగారు హరిద్వార్ వద్ద కాంగడీ గ్రామంలో గురుకులం స్థాపించడానికి అహర్నిశలూ పాటుపడుతూ తన సర్వస్వాన్ని అర్పించారు. చివరకు తన స్వార్జితంతో జలంధర్‌లో కట్టిన ఇంటిని కూడా గురుకులాని కిచ్చి వేయాలని నిర్ణయించుకొని, తన ఇద్దరు కుమారులు శ్రీ హరిశ్చంద్ర, శ్రీ ఇంద్రలను పిలిచి తన నిర్ణయాన్ని తెలిపినప్పుడా యిద్దరు కుమారులు దానపత్రంపై సంతకాలు చేసి తమ అంగీకారాన్ని ప్రకటించారు. స్వామీజీ ఆ దాన పత్రం మీద కుమారుల సంతకం కోరటానికి కారణం అంతకుముందే కొన్ని నెలలు క్రిందట ఆ ఇంటిని అమ్మి ఆ సొమ్మును సోదరులిద్దరూ చెరిసగం పంచుకోవాలని స్వామీజీ వీలునామా వ్రాశారు. అప్పట్లో ఆ ఇంటి ఖరీదు 20వేలుంటుందని అంచనా. వీలునామాలో హరిశ్చంద్రజీ 10వేల రూ॥లతో సద్ధర్మ ప్రచారక్ ప్రెస్సు నడపాలని, ఇంద్రజీ విదేశాలకెళ్ళి బారిస్టర్ పాసై రావాలని ఆదేశించారు. ఇప్పుడీ క్రొత్త దానపత్రంతో ఆ వీలునామా రద్దయింది. ఇదీ తండ్రీ కుమారుల త్యాగ నిరతి.

శ్రీ శ్రద్ధానంద స్వామి ఆరంభించిన **'ఆర్యసమాజ చరిత్రను'** వ్రాసే పనిని శ్రీ ఇంద్ర విద్యావాచస్పతిగారు పూర్తిచేశారు. అందులోని ఒక అంశమే - **స్వరాజ్య సంగ్రామంలో ఆర్యసమాజం'** అనే ఈ లఘు గ్రంథం. పాఠకులు ఆర్యసమాజ చరిత్రను సంపూర్ణంగా చదువుటకు ఈ లఘుగ్రంథం ప్రేరణనిస్తుందని ఆశిస్తున్నాను. దీనిని చక్కగా ముద్రించి యిచ్చిన ప్రింటుషాపువారికి మా ట్రస్టువారు కృతజ్ఞతలు తెలియజేస్తున్నారు.

మీ

**సంధ్యావందనం శ్రీనివాసరావు**

# శ్రద్ధాంజలి - ధన్యవాదములు

మాన్యశ్రీ పం. ఇంద్రజీ 'విద్యావాచస్పతి' (అప్పటి పార్లమెంట్ సభ్యులు) గారు రచించిన ఈ వ్యాసము ముందుగా "పం. వినాయకరావు 'విద్యాలంకార్' అభినందన గ్రంథం" లో ప్రచురింపబడినది. ఆ వ్యాసమును గురువర్యులు పం. గోపదేవ్‌శాస్త్రి గారు ఆంధ్రమున అనువదించి గుంటూరు ఆర్యసమాజమువారు ప్రచురించిన మహర్షి దయానంద బలిదాన శతాబ్ది ఉత్సవ స్మారికలో ప్రచురించుకొనుటకు పంపిరి. అది దానిలో ప్రచురింపబడినది. నేను దానిని చదువుటయు, దానిని ఒక లఘుగ్రంథముగా ప్రచురించిన బాగుండునను సంకల్పము కలుగుటయు జరిగినది. గురువర్యుల నడుగగా ఒక క్షణం ఆలోచించి గుంటూరు వారితో ఒక మాటచెప్పి ప్రచురించుకొమ్మని చెప్పిరి. కాని, కొన్ని పుస్తకముల ప్రచురించు తొందరుండుటచే చాలా ఆలస్యముగా ఈ పుస్తకమును ప్రచురించుచున్నాము.

గురువర్యుల అనంతరం వారి గ్రంథముల, వ్యాసములపై అధికారము లన్నిటిని శ్రీ శత్రుంజయ (అంబాదర్శన గ్రంథమాల - కూచిపూడి) గారికి యిచ్చి యుండుటచే ఆ పై యిరువురి అనుమతిని తీసుకొని ఈ పుస్తకము ప్రచురించుచున్నాము.

ఆదరణతో అనుమతి తెలిపిన దివంగతులైన **పూజ్య శ్రీ పం. గోపదేవ్ శాస్త్రి గారికి** నే నెట్లు ధన్యవాదములు తెలుపగలను. అందుచే వారి కిది **నా శ్రద్ధాంజలి.**

సహృదయతతో అనుమతి తెలిపిన గుంటూరు ఆర్యసమాజము వారికి, శ్రీ శత్రుంజయ గారికి నా హృదయపూర్వక **ధన్యవాదములు**. ముద్రణ దోషాలు సవరించిన శ్రీమనస్వీ వానప్రస్థి (ఆర్షగురుకులము - కామారెడ్డి) గారికి, మా కార్యదర్శి శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావుగారికి నా అభినందనలు.

బుధజన విధేయుడు

**ముముక్షుముని**

**(డా॥ కోడూరి సుబ్బారావు)**

# ఆర్యసమాజ సంక్షిప్త పరిచయము

సంస్థాపకుడు : మహర్షి దయానంద సరస్వతి

స్థాపనా స్థానము : ముంబాయి (గిరిగాంవ్)

తిథి : వి.శ. 1931 చైత్రశుద్ధ పాడ్యమి (యుగాది) బుధవారము (క్రీ.శ. 7-4-1875)

ముఖ్య ఉద్దేశ్యము : ప్రపంచమునకు ఉపకారము చేయుట (మానవ మాత్రులందరికి శారీరక, సామాజిక ఆత్మికోన్నతులను కలిగించుట)

నియమములు : ఆర్యసమాజ దశ నియమములు (వెనుక పుటలో నున్నవి)

**ముఖ్య ప్రామాణిక గ్రంథము** : పరమేశ్వర ప్రదత్త వేదము (ఋక్, యజు, సామ, అథర్వ వేదములు)

**ఇతర ప్రామాణికములు** : ఋషిముని కృత బ్రాహ్మణ, ఆరణ్యక, వేదాంగ, షడ్దర్శనాదులు, ప్రక్షిప్తరహిత మనుస్మృతి, గృహ్య సూత్రాదులు మొ॥నవి.

**మార్గదర్శక గ్రంథములు** : మహర్షి దయానంద విరచిత సత్యార్థ ప్రకాశము ఋగ్వేదాది భాష్యభూమిక, సంస్కారవిధి, వ్యవహారభానువు మొ॥నవి.

**శిక్షణ సంస్థలు** : బాలబాలికలకు విడివిడిగా ఆర్ష గురుకులములు అనేకము గలవు. యువకులకు ఆర్యవీర్‌దళ్ శాఖలు, ప్రచారము చేయగోరువారికి ఉపదేశిక విద్యాలయాలు, అభిరుచి గలవారికి పాతంజల యోగ, షడ్దర్శన, పురోహిత, సంస్కృత శివిరాలు నిర్వహింపబడుచుండును.

**ముఖ్యకార్యాలయము** : సార్వదేశిక ఆర్యప్రతినిధి సభ, దయానంద భవన్, 3/5, న్యూ ఢిల్లీ

ప్రాంతీయ శాఖలు : ప్రతి రాష్ట్రములోను ఆర్యప్రతినిధి సభలు మరియు అనేక శాఖోపశాఖలు (విదేశములందును శాఖోపశాఖలు) గలవు

కార్యకలాపాలు : అనేక విద్యాసంస్థల (DAV Colleges) దయానంద ఆంగ్లో వేదిక్ కళాశాలలు ఆర్య విద్వాంసులు స్థాపించినవే) ఆర్య అనాథాలయాలు, గో సంరక్షణ సంవర్ధన శాలలు, గ్రంథాలయాలు, చికిత్సాలయాలు, వానప్రస్థ సంన్యాసాశ్రమాలు, తుఫాను ఉప్పెన భూకంపాదులలో శరణార్థుల శివిరాలు, అనేక ఉద్యమాలు మొదలగునవి.

## ఆర్యసమాజ దశనియమములు (ముఖ్య సిద్ధాంతములు)

1. సమస్త సత్యవిద్యలకును విద్యవలన నెరుంగదగు సర్వ పదార్థములకును ఆదిమూలము పరమేశ్వరుడు.
2. ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళుడు, అజన్ముడు, అనాది, అనంతుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు. అతనినే ఉపాసించుట యోగ్యము.
3. వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము. వేదమును చదువుట, చదివించుట, వినుట, వినిపించుట ఆర్యులకందఱకు పరమ ధర్మము.
4. సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును ఎల్లప్పుడు సిద్ధముగా నుండవలయును.
5. సకల కార్యములను ధర్మానుసారముగా అనగా, సత్యా సత్యములను విచారించి చేయవలయును.
6. ప్రపంచమునకు ఉపకారము చేయుట, ఈ సమాజము యొక్క ముఖ్యోద్దేశ్యము. అనగా శారీరకోన్నతికి, ఆత్మోన్నతికి మఱియు సామాజికోన్నతికి పాటుపడవలయును.
7. అందరితో ప్రేమ పూర్వకముగ, ధర్మానుసారముగ, యథా యోగ్యముగ వ్యవహరింపవలయును.
8. అవిద్యను నశింపజేసి విద్యను పెంపొందింప జేయవలయును.
9. ప్రతి వ్యక్తియు తన యున్నతితోనే సంతృప్తినొందక అందఱి యున్నతిలోనే తనయున్నతి కలదని తలంపవలయును.
10. సమస్త మానవులుసర్వహితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై వ్యక్తిహితకరములగు నియమము లందు స్వతంత్రులగుట అందఱికి తగును.

*(ఈ దశ నియమములు కేవలము ఆర్యసమాజికులేగాక సర్వమానవులు అనుసరించదగిన సార్వత్రిక నియమములు)*

# వెలుగు చూపిన ఆర్యసమాజము

నేను సుమారు 35 సంవత్సరముల క్రిందట ప్రాకృతిక చికిత్సకొరకు భీమవరం (ప.గోదావరి జిల్లా) లో 3 సంవత్సరాలు గడిపియుంటిని. అప్పుడు అక్కడి ఆధ్యాత్మిక గ్రంథాలయంలోని అద్వైత సంప్రదాయానికి చెందిన అనేక గ్రంథాలు చదివితిని. దానితో అద్వైతభావాలు నాలో జీర్ణించుకుపోయినవి. తదుపరి రాయలసీమలోని ఆశ్రమాలలో గడుపుతూ బనగానిపల్లెలోని స్వస్తి ఆశ్రమానికి వెళ్ళితిని. అక్కడ నాకు వైదిక ధర్మ ప్రచారకులు కీ॥శే॥ శ్రీ డి.వి. స్వామిగారి ద్వారా ఆర్యసమాజ పరిచయం కలిగింది.

బనగానిపల్లెలో ఉండగానే ఒక అవధూతస్వామి గారి వెంట తెనాలి అఖిలాంధ్ర సాధుపరిషత్ సభలకు వెళ్ళియుంటిని. అక్కడ కేటాయింపబడిన ఒక పుస్తక విక్రయ స్థానంలో వెంటవెళ్ళిన స్వామిగారి పుస్తకములు నేను అమ్ముట జరిగినది. ఆ విక్రయస్థానం ప్రక్కనే కూచిపూడి ఆర్యసమాజము వారి పుస్తకములు విక్రయింపబడుచుండెను. అక్కడకు పూజ్య పం. గోపదేవ్ శాస్త్రిగారు వచ్చియుండిరి. అదే మొదటిసారి వారిని చూడటం. అంతకు ముందు వారిపేరు వినియుండుటవల్లను, వారు వ్రాసిన భగవద్గీత చూచియుండుటచేతను నేనే వారికి నమస్కరించి నా పరిచయం చేసుకొంటిని. అప్పటికి నాకు వైదిక సిద్ధాంతాలు ఏమీ తెలియవు. 'ఆర్యసమాజికులు విగ్రహారాధన చేయరు, సంధ్యా అగ్నిహోత్రాలు చేస్తారు' అని మాత్రమే అప్పటికి తెలుసును. అందుచే వారితో ఏమీ చర్చించలేదు.

తెనాలి సాధుసభలలో ఒక సంఘటన జరిగింది. శ్రీ శాస్త్రిగారు తననుకూడా ఒక సభ్యునిగా చేర్చుకొని మాట్లాడే అవకాశం ఇమ్మని అధ్యక్షులకు ఒక విజ్ఞాపన వ్రాసి పంపిరి. ఆంతరంగిక సభలో చర్చించి శాస్త్రిగారి విజ్ఞాపనను తిరస్కరించిరి. అవధూతస్వామిగారును అద్వైత సిద్ధాంతాన్ని అంగీకరించరు. వారు అరవిందయోగి

అనుయాయులు. అందుచే వారును శ్రీ శాస్త్రిగారిని సమర్థిస్తూ అంతరంగ సభలో మాట్లాడి యుండిరి. ప్రయోజనము కలుగలేదు. ఆ స్వామిగారికిని అతి కష్టము మీద పది నిమిషములు సమయమిచ్చిరి. శాస్త్రిగారికి సమయము నిరాకరించినందుకు నాకును కష్టమనిపించింది. సాధుపరిషత్తు కేవలము అద్వైతులకొరకే ననిపించింది. ఇంతేకాక, అద్వైతం మీద సంశయం కూడా కలిగింది. తప్పక ఒకసారి 'సత్యార్థప్రకాశం' చదివి చూడాలనే సంకల్పం కలిగింది. నేను బనగానిపల్లెకు తిరిగివచ్చితిని. చాలా ప్రయత్నించగా నాకు ఒక ప్రాత 'సత్యార్థప్రకాశం' దొరికింది. దానిని చదువుట ప్రారంభించితిని. అప్పటికే నాలో మూఢనమ్మకాలు అంతగా లేకపోవుటచే అయిదారు సముల్లాసాల వరకు సామాన్యంగానే అనిపించింది. సప్తమ,అష్టమ, నవమ, సముల్లాసాలు అద్వైత భావాలకు భిన్నంగా ఉండటంవల్ల ఎన్నియో ప్రశ్నలు తలెత్తినవి. పది, పదకొండూ కూడా చదివి చూచితిని. కొన్ని సందేహాలు పోయి, మరికొన్ని సందేహాలు తలెత్తినవి. మిగిలిన నాలుగు సముల్లాసాలు సామాన్యంగా చదివితిని. సందేహనివృత్తి కొరకు 7, 8, 9 సముల్లాసాలు పలుమార్లు చదివితిని. చదివిన ప్రతిసారి కొన్ని సదేహాలు పోగా మరికొన్ని వచ్చెడివి. ఈ రకంగా 5, 6 నెలలు గడచినవి. త్రైతవాద దృష్టితో మరొకసారి ఉపనిషత్తులు, గీత చదివిచూడాలనుకొంటిని. ఇంతలో భాగ్యనగరం (సికింద్రాబాద్) రావటం జరిగింది.

నేను సీతాఫలమండికి వచ్చిన క్రొత్తలో మలక్‌పేటలో పూజ్య పం. గోపదేవశాస్త్రిగారి వేదసప్తాహం జరుగుతుండెడిది. నేను ఆ కార్యక్రమంలో పాల్గొని కొన్ని విషయాలు తెలుసుకొంటిని. అనంతరం అక్కడనే జడ్జీల కాలనీలో ప్రత్యేకించి విద్యావంతులైన స్త్రీలకొరకు (జడ్జీల భార్యలు మొ. వారికి) సత్యార్థప్రకాశం పాఠముగా చెప్పనారంభించిరి. నేను శ్రీ శాస్త్రిగారి అనుమతి తీసికొని దూరంగా కూర్చొని ఆ పాఠములో పాల్గొంటిని. అది సుమారు రెండు నెలలకు పైగానే జరిగినది. ఆ తరగతిలో అద్వైత

సంప్రదాయానికి చెందిన స్త్రీలు కూడా కొందరుండుటచే అనేక ప్రశ్నలకు శ్రీ శాస్త్రిగారు చాలా చక్కగా వివరంగా సమాధానాలు చెప్పిరి. నేను అడిగిన ప్రశ్నలకును వారు ప్రమాణబద్ధంగా విశ్లేషించి చెప్పిరి. సత్యార్థ ప్రకాశంతో నాలోని అద్వైతాంధకారం సగం పోగా మిగిలిన సగం శ్రీ శాస్త్రిగారి విశ్లేషణతో పోయింది. ఈ సృష్టికి మూలకారణం ఒక్క పరమేశ్వరుడే కాక అనేకమంది జీవులు, సత్వరజోతమస్సు లను మూడు రకాల సూక్ష్మతమ పరమాణువులతో కూడిన మూల ప్రకృతి కారణములని గ్రహించితిని. ఈ త్రైతవాదమే త్రికాల సత్యమని నమ్మకం కలిగింది. అందుచే సత్యార్థప్రకాశ గ్రంథాన్ని నా మొదటి గురువుగా, శ్రీ శాస్త్రిగారిని రెండవ గురువుగా భావించుచున్నాను.

అనంతరం సీతాఫలమండి ఆర్యసమాజములో కఠోపనిషత్‌ప్రవచనం ఏర్పాటు చేయబడింది. సప్తాహంగా ప్రారంభింపబడిన శ్రీ శాస్త్రిగారి ఆ ప్రవచనం శ్రోతల కోరికపై నెలరోజుల వరకు పొడిగింపబడింది. ఆ నెలరోజుల కార్యక్రమంలో ఆర్యసమాజం గురించిన చాలా విషయాలు తెలిసినవి.

నెమ్మదిగా హిందీ చదివి అర్థం చేసుకోగల స్థాయిని పొందితిని. హిందీభాషలో ఆర్యసమాజ సాహిత్యం సాగరం మాదిరిగా ఉంది. అందు నే చదివినవి స్వల్పమే అయినా అవి నాకెంతో తృప్తిని కలిగించినవి. ఆర్య విద్వాంసుల విషయప్రతిపాదన, విశ్లేషణ, వేద, ఋషి, ప్రమాణములు హేతుబద్ధత, వైజ్ఞానికత నన్నెంతగానో ఆకర్షించినవి. అట్టివి మరి ఏ యితర ఆధ్యాత్మిక రచనలలోను, కానరాలేదు.

ఎంతో చదవాలని అభిలాష ఉన్నా శరీరబలహీనత కారణంగా ఎక్కువ చదువలేకపోయాను. నేను చదివిన, విన్న విషయాలను మనన చింతనలు చేసుకొంటూ, వైజ్ఞానిక దృష్టికోణంతో ఆలోచిస్తూ నా చిన్న చిన్న మాటలతో చెప్ప ప్రయత్నించితిని. అప్పుడప్పుడుశ్రీశాస్త్రిగారిని కలుసుకొని నా సందేహాలు తీర్చుకునేవాడిని. మలక్‌పేటలో దయానంద ఉపదేశిక

విద్యాలయము ప్రారంభించినప్పుడు నన్ను వచ్చి విద్యార్థిగా చేరుమన్నారు. కాని, ఎంతోమందికి ఉపయోగపడుతున్న చికిత్సాలయం మూసివేసి వెళ్ళలేకపోయాను. వారివద్ద దర్శనాదులు చదువుకోలేకపోవుట నా దురదృష్టమే. ఏమైనా ఈ జన్మలో సత్యమార్గం తెలిసిందని సంతృప్తి చెందుతున్నాను. అనంతరం శక్తికొలది స్వాధ్యాయం చేస్తూ మనన చింతనలతో నా జ్ఞానాన్ని పెంచుకునే ప్రయత్నం చేసాను.

ఈ విధంగా వేదాల వెలుగుమార్గం చూపింది ఆర్యసమాజమే. అట్టి ఆర్యసమాజానికి నే నెంతో ఋణపడియున్నాను.

## కృతజ్ఞతలు

గురువర్యులు పం. గోపదేవ్ శాస్త్రిగారిచే స్థాపించబడిన అంబా రామార్య సత్యార్థప్రకాశట్రస్టువారు కొంతకాలం క్రిందట నాకు పారితోషికం యివ్వదలచినట్లుగా ఉత్తరం వ్రాసిరి. నాకు ఆశ్చర్యం కలిగింది. నేను పండితుడను కాను. వైదిక ధర్మమునకు నేను చేసిన సేవకూడా స్వల్పమే. నాకు అట్టి అర్హతలేదు. మరొక యోగ్యమైన వ్యక్తికి ఇచ్చుట మేలని ఉత్తరం వ్రాసియుంటిని. అయినప్పటికి పోయిన వేసవిలో జరిగిన కూచిపూడి ఆర్యసమాజ వార్షికోత్సవ సభలో నాకు అయిదువేల రూపాయలు పారితోషకముగా ప్రకటించి ఒక మిత్రునకు ఒసంగి పంపించిరి. వారి అభిమానమును నిరాకరించుట కూడ మంచిదికాదని గురువుగారి ద్రవ్యముగా భావించి కృతజ్ఞతతో స్వీకరించి సాహిత్య ప్రచురణకై గాయత్రీ ఆశ్రమట్రస్టు వారికి ఒసంగుచున్నాను.

అంబా రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు అధ్యక్ష కార్యదర్శులకు ధర్మకర్తలకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

వైదిక ధర్మానురాగి - ఒక సుమార్గి

**ముముక్షుముని**

**(డా॥ కోడూరి సుబ్బారావు)**

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు వారి పుస్తకముల పట్టిక

**డా॥ కొడూరి సుబ్బారావు గారి రచనలు**

1. వేదాలలో సూర్యకిరణ చికిత్స (40=00)
2. వేదాలలో జలచికిత్స (20=00)
3. వైదిక క్రాంతి పథం (15=00)
4. అగ్ని హోత్ర వైజ్ఞానిక స్వరూపము (15=00)
5. దౌహృదిని (ఋషులదృష్టిలో గర్భిణిస్త్రీ) (15=00)
6. అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (15=00)
7. వైదిక వైజ్ఞానిక సంస్కృతి (10=00)
8. మానవ ధర్మము (10=00)
9. స్వరాజ్య సంగ్రామములో
   ఆర్య సమాజము (8=00)
10. గోమాత (7=00)
11. గాయత్రీ మహిమ (6=00)
12. జననీ - జన్మభూమి (5=00)
13. స్వాతంత్ర్య సముపార్జనలో
    మహర్షి దయానందుడు (4=00)
14. దైనిక అగ్ని హోత్ర విధి (4=00)
15. చతుర్దశ భువనములు (3=00)
16. యజ్ఞోపవీత వైశిష్ట్యము (2=00)

**శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు గారి రచనలు - అనువాదములు**

17. పురుషోత్తముడు శ్రీరాముడు (14=00)
18. వేదములలో విజ్ఞాన బీజాలు (10=00)
19. యుగపురుషుడు శ్రీకృష్ణుడు (8=00)
20. వైదిక వివాహ వైశిష్ట్యము (8=00)
21. ధర్మవీర్ పం. లేఖరాం (3=00)
22. మహర్షి మనువుపై విరోధమెందుకు? (3=00)

**ఇతరుల రచనలు - అనువాదములు :**

23. చాణక్యనీతి (40=00)
24. అక్కాచెల్లెండ్ల ధార్మిక చర్చ (20=00)
25. మాతా పుత్రికల జ్ఞాన చర్చ (15=00)
26. బ్రహ్మచర్య విజ్ఞానము (15=00)
27. శ్రీ దయానంద హృదయము (12=00)
28. సత్యధర్మ విచారణ (6=00)
29. ప్రణవ స్తోత్రమ్ (5=00)
30. వేదాలలో అప్సరస గంధర్వులు (2=50)
31. లక్ష్మీ సూక్తమ్ (వ్యాఖ్యానముతో) (2=00)
32. శాంతి ప్రార్థన (2=00)
33. ది గ్రేట్ గాయత్రి (2=00)
34. వైదిక అర్థనీతి (2=00)

ఓ౩మ్

# స్వరాజ్య సంగ్రామములో ఆర్యసమాజము

క్రీ.శ. 1947 ఆగష్టు 15వ తేదీతో పూర్తియైన స్వాధీనతా యజ్ఞము మహర్షి శ్రీ దయానంద సరస్వతీ స్వామితో ప్రారంభమై గాంధి మహాత్ముని అంతిమ ఆహుతితో పూర్తియైనదని చెప్పుట అత్యుక్తి కానేరదు. గణతంత్ర రాజ్య ప్రాప్తితో పూర్తియైన రాజ్యక్రాంతికి విత్తనం వేసినవాడు దయానంద మహర్షి యనుటలోను సందేహ మావంతయు లేదు.

మహర్షి మూడు ఉపాయములతో భారతవాసుల హృదయము లందు పరాధీనత నుండి విడివడుటకు, రాజనైతిక స్వాధీనతను బొందుటకును అభిలాషను జనింపజేసెను. భారత వాసుల హృదయములందు తమ దేశముకొఱకు, ధర్మము కొఱకు స్వాభిమానము నుత్పన్నము చేయుట మొదటి యుపాయము. మహర్షి కార్యక్షేత్రమున దిగునపుడు దేశము నందలి శిక్షిత సమాజము పాశ్చాత్య సభ్యత యందును, ఇంగ్లండు మీదగల భక్తి ప్రవాహము నందును పడి కొట్టుకు పోవుచుండెను. సంస్కరణ-అభిలాష దేశవాసులలో నక్కడక్కడ అంతకుముందే యుద్భవించెను. కాని అయ్యది దేశాసులను ఇంగ్లీషుభాషకును, ఆంగ్లేయుల యాలోచనలకును భక్తులనుజేసి, ఆత్మసమ్మానము తగ్గింప జేయునదై యుండెను.

మహర్షి తన యుపదేశములమూలమున ఇతర దేశములవంక పరుగిడు భారతీయుల దృష్టులను స్వదేశాభిమానమువంకకు మరల్చెను. మహర్షి జగత్ ప్రసిద్ధమయిన తన సత్యార్థప్రకాశమను గ్రంథమున నిట్లు వ్రాసి యున్నాడు. "ఈ యార్యావర్త దేశమునకు సమానమైన దేశము భూగోళమునందు మరి యొకటి లేదు. ఈ దేశము పారస్ మణి వంటిది. లోహమువంటి ఇతర దేశము లీ దేశమును స్పృశించినంత మాత్రముననే సువర్ణమయములగును. అనగా ధనవంతము లగునని భావము" ఆ గ్రంథముననే మరియొక స్థలమున నిట్లు వ్రాసి యున్నాడు. " ఏ దేశపు పదార్థముల వలన తమ దేహములు పుట్టినవో, పోషింపబడుచున్నవో, ఇకముందునూ పోషింపబడునో ఆ దేశపు, ఉన్నతిని ఎల్లరు భక్తితో కలిసి మెలిసి తను మనో ధనములతో నొనర్పవలయును"

మచ్చున కిట నీ రెండు ఉదాహరణములు వ్రాయబడినవి. మహర్షి రచించిన గ్రంథములలో స్వదేశాభిమానము ఎడనెడ నెంతగానో వర్ణించుట చూడనగును. భారతదేశవాసుల హృదయములందు మహర్షి నింపజూచిన స్వదేశాభిమాన సారమును సత్యార్థప్రకాశము నందలి యేకాదశ సముల్లాసమున వ్రాసిన యీ వాక్యములను జదివి తెలిసికొన వచ్చును. "సృష్టిమొదలు ఐదువేల సంవత్సరముల పూర్వము వరకు ఆర్యుల సార్వభౌమ చక్రవర్తి రాజ్యము భూగోళమున నెల్లరిని మించి యుండెను. ఇతర దేశములందు చిన్న చిన్న సామంతరాజులుండెడివారు. కౌరవ పాండవ రాజ్యకాలమువరకు ఈ దేశపు సార్వభౌమ చక్రవర్తి రాజ్యమునందే భూగోళపు ఇతర రాజులు అందరు సామంతరాజులుగా నుండెడివారు.

**మానసిక దాసత**

ఒకప్పుడీ దేశము శక్తిసంపన్నమై స్వాధీనమై యుండెడి దనియు, మరల సరిగా యత్నించినచో నీ దేశము స్వాధీనతా శిఖరము నందుకొనగల దనియు నీ దేశవాసులకు తెలుపవలసి యున్నది. ఇట్లు తెలిసికొని

రాష్ట్ర స్వాధీనత కొఱకు ప్రయత్నించుటకు మొదటి యడుగు వేయవలయును. పిదప ఏ కారణముల వలన మన యీ రాష్ట్రము పరాధీనమై పూర్వగౌరవమును పోగొట్టుకొని యపమానిత మగుచున్నదో యా కారణములను చూచిన మీదట, మానసిక దాసతయే యీ దేశముయొక్క అర్థిక, రాజనైతిక దాసతకు మూల కారణమని తెలియవచ్చెను. మహర్షి రోగస్వరూపమును గుర్తించి చతురవైద్యునివలె మొదట రోగపు మూల కారణమును దొలగింప నారింభించెను. అందుకనియే చెప్పవచ్చును. మహర్షి తన శాస్త్రీయములగు నాలోచనలతోను ఓజస్సుతో గూడిన వాణితోను శతాబ్దములనుండి మూతబడియున్న భారతీయుల ఆలోచనా సముద్రము నతి వేగముగా మథించి - తరిచి యందుండి అనా యాసముగ ఆలోచనాస్వాధీనత, కర్మల నొనర్చుటలో ప్రవృత్తియు ననెడి బహుముఖ్య రత్నముల నావిర్భవింప జేసెను. ఇయ్యది మహర్షి యొక్క సర్వాభిప్రాయములతో నేకీభవించని వారును అంగీకరింపక తప్పదు. మానసిక స్వాధీనత లేనినాడు సామాజిక స్వాధీనత కాని , అది లేనినాడు రాజనైతిక స్వాధీనత కాని సంభవము కాదనుట యెల్ల రంగీకరించిన విషయమే ఇట్లు దయానంద మహర్షి భారతదేశవాసులకు స్వదేశమునుగూర్చి భక్తిభావన రూపమను నమృతమును పానము చేయించుటయేకాక, వారి మానసిక పరాధీనత యనెడి సంకెళ్ళను తెగనరికి రాష్ట్రమును స్వాధీనతా మార్గమున నడిపించిన వాడయ్యెను.

### స్వరాజ్యపు రూపురేఖలు

మహర్షి యంతటితోనే సంతుష్టుడు కాడయ్యె. అతడు స్వరాజ్యము యొక్క యథార్థ స్వరూపమును దేశము నెదుట నుంచెను. స్వరాజ్యప్రాప్తికి డెబ్బది యేండ్లు పూర్వమే మహర్షి తన సత్యార్థ ప్రకాశమునందు ప్రకటించిన స్వరాజ్య ఆదర్శమును జూచిన నెల్లరకు మహదాశ్చర్యము కలుగును.

అప్పటి భారత శిక్షిత సమాజముకూడ ఆ యాదర్శముకెన్నో ఆమడల దూరమున వెనుకబడి యుండెను. సత్యార్థప్రకాశమున అష్టమ సముల్లాసమున మహర్షి యిట్లు వ్రాసియున్నాడు.

"ఆర్యావర్తమునందును ఈ సమయమున ఆర్యుల అఖండ స్వతంత్ర స్వాధీన నిర్భయ రాజ్యము లేదు. ఉన్న కొంచెముకూడ విదేశీయుల పాదాక్రాంతమై యున్నది. కొలది మంది రాజులు ఒకింత స్వతంత్రులుగా నున్నారు. దుర్దినములు వచ్చినపుడు దేశవాసు లనేక దుఃఖముల ననుభవింతురు. ఎవరెంత చేసినను స్వదేశీరాజ్యము అన్నింటికంటె నుత్తమ మగును. లేక, మతమతాంతర ఆగ్రహరహితమై, స్వపర పక్షపాత శూన్యమై, ప్రజలమీద తండ్రివలె దయతో న్యాయముతో కూడిన విదేశీయుల రాజ్యముకూడ పూర్ణసుఖదాయకము కాదు"

పూర్ణస్వరాజ్యమునకు ఇంతకంటె మంచివ్యాఖ్య యేమి కాగలదు? సత్యార్థప్రకాశమునందు మహర్షి స్వరాజ్యమునకు చేసిన యీ వ్యాఖ్యకు తరువాత పదియేండ్లకు "ఇండియన్ నేషనల్ కాంగ్రెస్" భారత జాతీయ కాంగ్రెసు స్థాపింపబడినది. ఆ కాంగ్రెసులో ముందు విదేశీయుల రాజ్యమున నౌకరీలు-ఉద్యోగములు మాత్రమే కోరబడినవి. తరువాత ననేక సంవత్సరముల వరకు ఇంగ్లండు ఛత్రచ్ఛాయలో ప్రతినిధి - త్వాధికారము కొంతవరకు యాచింపబడినది. ఆ తరువాత కాంగ్రెస్ ఔపనివేశిక స్వరాజ్యము తన ధ్యేయముగా జేసికొన్నది. తదుపరి క్రీ.శ. 1929లో రావి నదీతీరమున జరిగిన కాంగ్రెస్ సమావేశమున పూర్ణ స్వరాజ్యము కోరబడినది. రాజనీతిజ్ఞుల మనిచెప్పకొను కాంగ్రెసు నాయకులు ఇరువదియవ శతాబ్దపు ప్రథమ చరణానంతరమున నే ఆదర్శమునకు చేరగలిగిరో మహర్షి దయానంద స్వామి పందొమ్మిదవ శతాబ్దాపు అంతిమ చరణ ప్రారంభముననే ఆ యాదర్శము నందుకొన

గలిగిరి. మహర్షి వర్ణించిన స్వరాజ్య స్వరూపమునే నేడు రాజనీతిజ్ఞులు గణ రాజ్యమనుచున్నారు. ప్రజలచే రాజు నిర్వాచితుడు కావలయును. మంత్రుల సభచేత శాసనములు చేయబడవలయును. స్త్రీ పురుషులు రాజ్యమున సమానాధికారములు కలిగి యుండవలయును. ఈ మూల సిద్ధాంతములనే దేశము గణతంత్ర రాజ్యమును స్థాపించుటతో బాటు అంగీకరించినది. వీనినే మహర్షి తన గ్రంథములం దెన్నడో ప్రతిపాదించి యుండెను. కావున క్రీ.శ. 1947 ఆగష్టు 15న పూర్తి చేయబడిన స్వాధీనతా యజ్ఞము దయానందమహర్షియే ప్రారంభించా డనుట అన్ని విధముల సముచితమే.

## శ్యామజీ కృష్ణవర్మా

శ్యామజీ కృష్ణవర్మా దయానందుని ముఖ్య శిష్యులలో నొక్కడు. అతడు కారియావాడ నివాసి. అతడు ఇంగ్లండు వెళ్ళి బార్‌ఎట్ లా ప్యాసు అయి వచ్చినాడు. మహర్షికి మిక్కిలి విశ్వాస పాత్రుడు. మహర్షి పరోపకారిణీ సభను ప్రారంభించినపుడు శ్యామజీకృష్ణవర్మను ఆ సభకొక సభ్యునిగా జేసెను. మహర్షి స్వయముగా ఇంగ్లీషు భాషను బొత్తుగా నెరుగకున్నను భారతీయులకు విదేశీభాష - ఇంగ్లీషు మిక్కిలి అవసరమని యెంచెడివాడు. ఇంతేకాక భారతీయులు విదేశముల కేగి ఆధునిక విజ్ఞానము శిల్పము మున్నగునవి నేర్చుకొనుట అవశ్యక మని యెంచెడివాడు. అతడీ విషయమును గూర్చి యూరపు విద్వాంసులతో పత్ర్యవహారముకూడ చేసి యుండెను. అందువలననే దయానంద స్వామి కృష్ణవర్మను విదేశములకు పంపి యతనిని భారతదేశమునకు మిక్కిలి యుపయోగిగా జేయ ననువగు ఆలోచనలు అనేక పర్యాయములు ప్రకటించి యుండెను. స్వామి మరణాంతరము కృష్ణవర్మ ఇంగ్లండు వెళ్ళి యక్కడ నివసించెను. అక్కడనే యుండి యతడు భారతదేశపు స్వాధీనతా సంగ్రామమునకు జేసిన

బహుమూల్య సహాయము రాష్ట్రీయ ఆందోళనను గూర్చి వ్రాయు చరిత్ర కారులకు బాగుగ తెలిసిన విషయమే - 1905లో వర్మ లండనునందు 'ఇండియా హౌస్' పేరుతో నొక కేంద్రమును స్థాపించెను. అందే **ఇండియన్ హోమ్‌రూల్ సొసైటీకి** అధ్యక్షుడుగా నుండెను. ఆ సొసైటీ పక్షాన **'ఇండియన్‌సోషియాలజిస్టు'** పేరుతో నొక మాసిక పత్రికకూడ ప్రకటింపబడు చుండెడిది. వర్మయే ఆ పత్రికకు సంపాదకుడుగా నుండెను. ఆ పత్రిక మూల్యము ఒక్క అణామాత్రమే. దానియందు రాజనీతిని గూర్చి ఎక్కువగా ప్రచారము చేయబడుచుండెడిది. ఆ పత్రిక ఇంగ్లండులో నుండు భారతీయులకు రాజనీతిని బోధించు ధర్మశాస్త్ర మయ్యెను. పలువురు భారతీయులు వర్మచే నొసంగబడు ఛాత్రవృత్తితో ఇంగ్లండులో విద్య నభ్యసించుచుండెడివారు. మదన్‌లాల్ ధీంగ్రా అను నొక వ్యక్తిచే కర్జన్‌వాయలీ లండన్‌లో హత్యచేయబడుటచేత శ్యామజీవర్మ వంటి క్రాంతికారులయిన నాయకులు ఇంగ్లండులో నివసించుట బ్రిటిష్ ప్రభుత్వానికి రుచింపదయ్యె. కావున వర్మ ఇంగ్లండు విడిచి పారిస్ నగరమునకు వెళ్లవలసివచ్చెను. అటనుండియే రాష్ట్రీయ ఆందోళన నడుప సాగెను. లాలా హరదయాల్ ఎమ్.ఎ., భాయీ పరమానంద ప్రభృతులు ప్రముఖ క్రాంతికారులుగ ఇంగ్లండులో పరిగణింపబడు చుండెడివారు. అప్పుడు వీరికి శ్యామజీ కృష్ణవర్మనుండి సర్వవిధ సహకారములు లభించుచుండెవి.

### భిక్షావృత్తి కాదు

కాంగ్రెసు ప్రారంభింపబడిన కాలమున దాని వృత్తి 'భిక్షావృత్తి'గా నెంచబడుచుండెడిది. కారణమేమన కాంగ్రెస్ చేయు తీర్మానములలో విక్టోరియా మహారాణిచేయు ఘోషణా పత్రము ప్రశంసింపబడుచుండెడిది. హోదాల కొఱకు ప్రార్థనలు చేయబడుచుండెడివి. భారతీయుల కొఱకు

రాజనైతిక అధికారములను సంపాదించుటయే కాంగ్రెస్ ఉద్దేశమయి యుండెను. దయానంద మహర్షియొక్క పూర్ణప్రతినిధి సత్తాత్మక రాజ్యమునకు సంబంధించిన ఉపదేశములను వినిన వారి హృదయములు హోదాలను భిక్షగా ననుగ్రహించుడని యాచించుటకెట్లు సిద్ధములగును? ఆనాడు కాంగ్రెసులో ప్రవేశించుటకు చరిత్రకు-నడవడికి - సంబంధించిన పరీక్ష యేమియు నుండెడిదికాదు. ఇయ్యది ఆర్యజనులకు రుచించెడిది కాదు. అందువలననే ఆర్యజనులు కాంగ్రెస్ విషయమున సామాన్యముగ నుపేక్షాభావము కలిగియుండేవారు. కాన, భారతదేశమునకు రాజనైతిక అధికారము సంపాదింపవలయు ననెడి కాంగ్రెస్ లక్ష్యము ఆర్యజనులను తనవంకకు ఆకర్షింపకుండెడిది కాదు. కావుననే వారిలో రాజనైతిక మనోవృత్తి కలవారు ప్రారంభము నుండియు కాంగ్రెసు కార్యకలాపములలో సహకరించుచునే యుండిరి. అందువలననే ప్రయాగలో జరిగిన కాంగ్రెసు మహా సభలలో లాహోర్ నివాసియైన లాలాలజ్‌పతిరాయ్ అంబాలా నివాసియగు మురళీధరబాబు కాంగ్రెసు ప్రతినిధుల రూపమున పాల్గొనిరి. అనంతర వర్షమున కాంగ్రెస్‌ను లాహోర్‌లో జరుపుటకు ఆహ్వానించిన ప్రముఖులలో లాజ్‌పత్‌రాయ్ ప్రభృతులును ఉండిరి. లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభ విశిష్టమైనదని చెప్పక తప్పదు. శ్రీ దాదాభాయినౌరోజీ బ్రిటిష్ పార్లమెంటుకు సదస్యుడైన తరువాత మొదటి మాటు భారతదేశమునకు వచ్చియుండెను. వారిని స్వాగతము చేయుటలోను, కాంగ్రెస్ అధివేశనమునకు సంబంధించి కార్యజాతమును నిర్వర్తించుట లోను పెక్కురు ఆర్యసామాజిక ప్రముఖులు పాలుపంచుకొని యుండిరి. లాలాలాజపత్‌రాయ్, బక్షీ, జయశ్రీరామ్, రాయ్ మూలరాజ్ ఎమ్.ఎ. మురళీధరబాబు మున్నగు ఆర్యసజ్జన ప్రముఖులు స్వాగత కార్యకారిణీ సమితికి సదస్యులై పనిచేసిరి.

## వంగ విభజన తదుపరి

క్రీ.శ. 1906 వరకు దేశరాజకీయాలు పైన వర్ణించినట్లు మందకొడిగా నడుచుచుండెడివి. లార్డుకర్జన్ వంగ విభజన చేయుట భారత రాజనీతికి ప్రాణము పోసినట్లయ్యెను. వంగ భంగము వంగీయుల హృదయములకు మిక్కిలి బాధకలిగించెను. వారు నాడుచేసిన ఆర్తనాదము సమస్త భారతీయుల కన్నులను తెరిపించెను. దేశవాసులెల్లరు వాస్తవమున దాస్యమును ఒక అభిశాపముగా ననుభవింపసాగిరి. వంగ విభజనకు సంబంధించిన ఆందోళనము దేశమునందంతట వ్యాపించెను. పంజాబ్‌లో నది యుగ్రరూపము ధరించెను. అప్పటికే రాజనైతిక నేతృత్వము పూర్తిగా లాలాలజపత్‌రాయ్ గారి చేజిక్కెను. వారి ప్రభావశాలి భాషణలు సమస్త ప్రాంతమును ఆవేశ పూర్ణము చేసెను. అప్పటి వారి గర్జనల కారణముగా లాజపత్‌రాయ్ **'పంజాబు కేసరి'** యయ్యెను. అతడు దయానందమహర్షి ముఖ్య శిష్యుడు. అందువలన ఆ పంజాబుకేసరి గర్జన ఆర్యసామాజికుల నెంతగానో ప్రభావితులను జేసెను. వంగ విచ్ఛేదము కారణముగ పంజాబ్‌లో జరిగిన ఆందోళనలో పాల్గొనినవారిలో బహుసంఖ్యాకులు ఆర్యసామాజికులే. లాలాహంసరాజు, సాహనీ మున్నగు ఆర్యసమాజ నాయకులే రావల్‌పిండిలో జరిగిన కాండలో నాయకులై యుండిరి. లాహోర్‌కు సంబంధించిన రాష్ట్రియ కార్యకర్తలలో అధికసంఖ్యాకులు ఆర్యసామాజికులే. నానాటికి వృద్ధిపొందుతున్న లాలాలాజపత్‌రాయ్ ప్రభావమునకు భయపడి ప్రభుత్వము అతనిని మాండలే కోటలో నిర్బంధించినది. అప్పుడే సమాజికుల పైనను, ఆర్యసామాజిక సంస్థల మీదను ప్రభుత్వపు క్రూర దృష్టి పడినది. అది ఆర్యసమాజికులకు కఠిన పరీక్షా సమయమయ్యెను. ప్రభుత్వపు టంతరంగ క్షేత్రములలో నీ ప్రభావము మిక్కుట మయ్యెను. ప్రభుత్వపు కార్యాలయములలో పని

చేయు ఆర్యసామాజికులు సమాజ సద్యస్యతకు త్యాగ పత్రమియ్యకున్నచో వారిని ఉద్యోగమునుండి తొలగింపవలయునని ప్రభుత్వము నిర్ణయించెను. కొందరి ప్రమోషను (పదోన్నతు) లు అడ్డగింపబడెను. కొందరిని పదవులనుండి తొలగించుటయు జరిగెను. కాని, యే ఆర్య సామాజికుడును తన నౌకరీ పోవు నను భయముతో సమాజ సదస్యతకు త్యాగపత్రము నియ్యలేదని చెప్పుటకు మిక్కిలి సంతోషించుచున్నాము.

**సత్యాగ్రహము ఆర్యసమాజము**

రౌలట్ యాక్టునకు విరుద్ధముగా గాంధి మహాత్ముడు సత్యాగ్రహమునకు సంబంధించిన ఘోషణ చేసినప్పటి నుండి కాంగ్రెస్ యొక్క రెండవ యుగము ప్రారంభమైనది. సత్యాగ్రహమునకు మూల సిద్ధాంతములు రెండు. ఒకటి సత్యము రెండవది అహింస. చరిత్ర-మంచినడవడి గలిగిన మనుష్యుడే పై రెండు సిద్ధాంతములను పాలింపగలుగును. ఈ యాలోచన పరంపర ఆర్యసమాజకులకు ప్రియమైనది. అది వారి జీవననంబద్ధమగు ఆలోచనల కనుకూలమైనదియును. దాని ఫలితముగా అంతకు పూర్వము కాంగ్రెసు కురీతినీతులను కఠోరముగా ఖండించిన శ్రద్ధానందస్వామి గాంధి మహాత్మునకు టెలిగ్రాం ద్వారమున "నేను సత్యాగ్రహ ప్రతిజ్ఞాపత్రము మీద సంతకము చేసితిని" అని తెలిపెను. శ్రద్ధానందస్వామి సత్యాగ్రహమున సమ్మిళితుడగుట ఆర్యసామాజికులకు సూచకమయ్యెను. దేశము నందంతటనుండు ఆర్యసామాజికులు సత్యాగ్రహ సేనలోచేరుటకు తమ పేర్లను వ్రాసి పంపిరి. సామాజికులకు సత్యాగ్రహ మూల రూపము ధర్మానుకూలముగ ప్రకమగుటయే కాక గాంధి మహాత్ముని యున్నత జీవనముకూడ వారిని ఆకర్షించెను. సత్యాగ్రహమును ఘోషించినది. మొదలు పంజాబు మార్షల్‌లాకు అమృతసర్ కాంగ్రెసు మహాసభ సమాప్తి

వరకు గల విస్తృత చరిత్రను తిలకించినచో, నాటి ఉత్తర భారతపు స్వాధీనతా సంగ్రామమున పాల్గొనిన సైనికులలో నధిక సంఖ్యాకులు ఆర్యసామాజికులుగా గోచరింతురు భిన్నభిన్న నగరములలోని ఆర్యసమాజపు ప్రముఖులగు అధికారులెల్లరు ఇతరుల కంటె ముందుముందుకు వచ్చి ఆందోళనలోపాల్గొని యున్నారు. డాక్టర్ సత్యపాల్, శ్రీరామభజదత్త ప్రభృతి నాయకులెల్లరు ఆర్యసామాజికులే. దాని పరిణామముగ పంజాబులో మార్షల్‌లా అమలు చేసినపుడు పంజాబుకు సంబంధించిన నగరములందంతటను ఆర్యసామాజికులు సంకటముల పాలగుటయే కాక సమాజమునకు చెందిన సంస్థలు కూడ ఇక్కట్లు పడకతప్పదయ్యె. అనేక ప్రముఖులైన ఆర్యసామాజకులపై మార్షల్‌లా ప్రహారము జరుపబడెను. డి.ఎ.వి. కాలేజీ విద్యార్థులపై జరుపబడిన అత్యాచారములను ప్రభుత్వము యొక్కయు, కాంగ్రెసు యొక్కయు కమిటీలు చేసిన పరిశీలనలో చదివినపుడు పాఠకులు రోమాంచితులు కాకపోరు. హాస్టళ్ళలో నున్న విద్యార్థులు తెల్లజాతిపై కుల కాపలాలో ప్రక్కచుట్టలు నెత్తిపై నుంచుకొని గ్రీష్మకాలపు మండుటెండలో రెండు మూడు మైళ్ళు నడచుటకు బాధ్యులు కావలసి వచ్చిరి. వారు నడుచునపుడు ఏ మాత్రము నడక మందగించినను తెల్లవారి తిట్లకు, తుపాకీ పోట్లకు గురి యయ్యెడివారు. 'గుజరాంవాలా' యందు ఒక గురకుల పాఠశాల యుండెను. దాని మీదను మార్షల్ లా అధికారి కుదృష్టిపడెను. అతడు తన యధికారము నంతటిని ఉపయోగించి యా పాఠశాలను నష్టభ్రష్టము చేసెను. దేశమున ఇతర భాగములందుగల ఆర్యసామాజికులును ముందు సత్యాగ్రహము నందును, తదుపరి కాంగ్రెసు నకును తమ సహకారము నందింపసాగిరి.

క్రీ.శ. 1919 అంతమున అమృతసర్‌లో జరిగిన కాంగ్రెసు

అధివేశనమునకు సంబంధించిన స్వాగతసమితి కార్యకలాపములను నిర్వర్తించిన వారిలో నూటికి 75 మంది ఆర్యసామాజికులే. స్వాగత సమితి అధ్యక్ష పదవిని స్వీకరించిన శ్రద్ధానంద స్వామి ప్రభావ, పరిశ్రమల వలననే అమృతసర కాంగ్రెస్ మహాసభ అధివేశనములు సఫలమైనవని చెప్పక తప్పదు. స్వాగతాధ్యక్షుడు తన భాషణమును రాష్ట్రభాషయైన హిందీభాషలో చదువుట కాంగ్రెస్ చరిత్రలో మొదటిసారి యని చెప్పవలయును. అదియును కాంగ్రెసుకు ఆర్యసమాజ మిచ్చిన మొదటి వర మనవచ్చును.

## ఆర్యసామాజిక విప్లవకారులు

యూరపునందు విప్లవకారులను సమకూర్చుటలో శ్యామజీ కృష్ణవర్మ వహించిన ప్రముఖభాగమును పూర్వమే వర్ణించి యున్నాము. భారతదేశమున నంతకు పూర్వమే విప్లవకారుల దళము జన్మించియుండెను. కొందరు విప్లవకారుల కార్యప్రణాళిక నంగీకరింపక పోవచ్చును. కాని ఆ విప్లవకారుల ఓజస్వంతమగు దేశభక్తిని, వారి అద్భుత సాహసమును భారతవాసులలో నెవ్వరును తిరస్కరింప జాలరు. స్వరాజ్యప్రాప్తియందు వారొనర్చిన బలిదానమువలన నెంతయో సహాయము లభించిన దనుటలోను ఆవంతయు సందేహము లేదు.

ఆర్యసమాజ సిద్ధాంతముల ననుసరించు విప్లవాదులలో మొదటివాడు మదనలాల్ ధీంగడా. అతడు లండన్‌లో కర్నల్ వాయలీని హత్యచేసినవాడు. కోర్టులో యువకుడైన మదనలాల్ తన సమాధానము నిట్లు చెప్పి యున్నాడు. "నా వంటి నిర్ధనుడు, మూర్ఖయువభక్తుడునునైన పుత్రుని దగ్గర దేశమాత కర్పించుటకు నా దేహము నందలి రక్తమునకు మించి మరి యేమి యున్నది? నాయీ రక్తముతోనే దేశమాత చరణము లందు శ్రద్ధాంజలి నర్పించుచున్నాను. భారతదేశమున నిప్పుడు నేర్పవలసిన

శిక్షణ ఎట్లు మరణించవలయు ననునదితప్ప మరియొకటి లేదు. అది నేర్వవలసిన పద్ధతియు స్వయం మరణించుటయే. నేను మాటి మాటికి భారతదేశమున జన్మించి మాతృసేవలో ప్రాణముల నర్పించవలయు ననియే నేను భగవంతుని ప్రార్థించుచున్నాడ; వందేమాతరమ్."

యువావస్థలో విదేశీయులలో ఆర్యసమాజ సిద్ధాంతములను ప్రచారము చేయనేగిన వారిలో భాయీ పరమానంద గారు కూడ ఒకరు. ఆయన పంజాబులో విప్లవవాదులలో ముఖ్యుడై ప్రభుత్వ క్రోధమునకు గురియై జన్మఖైదు ననుభవించుటకు అండమాన్ దీవులకు పంపబడెను. భాయీ బాలముకుంద్, భాయీ పరమానంద్ ఇద్దరు.... సోదరులు డి.ఏ.వి కాలేజీలో బి.ఎ. పరీక్షలో నుత్తీర్ణులైరి. 1910-11 సంవత్సరములలో పంజాబునందు ఏర్పడిన రాజనైతిక అశాంతిదుమారము పలువురు నవయువకులను విప్లవవాదులుగా మార్చివైచెను. వారిలో భాయీ బాలముకుంద్ కూడ నొక్కడు. లాహోర్ షడ్ యంత్ర కుట్ర-కేసులో నతడును పట్టుబడెను. దీనానాథుడను వ్యక్తి ప్రభుత్వము పక్షము వహించి సాక్ష్యము చెప్పినందున ఉరిశిక్షకు గురియైనవారిలో బాలముకుంద్ కూడ ఒకడైయుండెను. అతని బలిదానముతో సంబంధముగల మరియొక సత్యసుందర బలిదానమునకు సంబంధించిన గాథ యొకటి యిట్లున్నది.

"భాయీ బాలముకుందుని నవ వివాహిత పత్ని తన భర్తను ఉరికంబము నెక్కించిన వార్తవినుటయే తడవుగా లేచి స్నానమొనర్చి క్రొత్తవస్త్రములను ఆభరణములను ధరించి వెళ్ళి యొక అరుగుమీద కూర్చుండెను. అట్లు కూర్చుండి వెంటనే తన ప్రాణములను త్యజించి తానుకూడ మాతృభూమి వేదికమీద బలిదాన మొనర్చియుండెను.

ఈ దంగాలోనే మహాత్మా హంసరాజుయొక్క సుపుత్రుడు బలరాజుకూడ పట్టుకొనబడెను. ఇట్లే పలువురు ఆర్యసామాజికులు

విప్లవవాదులను నెపమున పట్టుబడి దుర్భరజైలుశిక్షల ననుభవించిరి. ఎందరో ఉరిశిక్షలపాలయిరి.

క్రీ.శ. 1924-25లో ఉత్తరప్రదేశమున విప్లవవాదులకు సంబంధించిన సంఘ మొకటి బలమైనది యేర్పడెను. ఆ సంఘ మొనర్చిన అనేక ఘనకార్యములలో కాకోరి బందిపోటు కేసు ఒకటి మిక్కిలి ప్రసిద్ధమైనది. ఆ దళమునకు ముఖ్యనాయకుడైన శ్రీ రామప్రసాద్ "బిస్మిల్" ప్రసిద్ధ ఆర్యసామాజికుడే. అతని సహచరుడైన గేందాలాల్‌కూడ ఆర్యసమాజ సిద్ధాంతముల నంగీకరించువాడే. రామప్రసాద్ "బిస్మిల్" మాత్రము మిక్కిలి చిన్నవయస్సునుండియే విప్లవవాదుల ఆలోచనలచే ప్రభావితుడైయుండెను. అతడు ప్రభుత్వపు కార్యాలయములమీదను, ట్రెజరీలమీదను జరిగిన ఆక్రమణలలో పాల్గొనియుండెను. చివరకు లక్నో సమీపమున కాకోరి స్థానమున జరిగిన భయంకరమైన బందిపోటు దొంగతనములో రామప్రసాద్ "బిస్మిల్" ఆ దళానికి ముఖ్యుడుగా పట్టుకొనబడెను. "బిస్మిల్" కవికూడ. ఇది యతని కవితకు సంబంధించిన ఉపనామమే. అతడు జైలులో తరుచుగా పాడుకొను గీతములలో గల అంతిమ చరణములలో నొకదేశభక్తుని నిజమైన హృదయవేదన ప్రకటమగు చుండెడిది.

"అబ్ న పిఛలే వల్ వలే హైఀ, ఔర్ న అరమానోంకీ భీడ్
ఏక్ మిట్‌జానేకీ హసరత్ బస్ దిలే బిస్‌మిల్ మే హై"

ఇప్పుడు బిస్మిల్ హృదయమున ఆ కోరికలు గానీ, భావములు కాని లేవు. చావవలెనను కోరికమాత్రము మిగిలియున్నదని భావము.

ఉరికంబము నెక్కుచు "బిస్మిల్" ఈ క్రింది గీతము పాడియుండెను.

"మాలిక్ తేరీ రజా రహే, ఔర్ తూ హీ తూ రహే
బాకీ మై న రహూఀ, న మేరీ అరజూరహే"

ఓ భగవన్! స్వామీ! నీ కోరిక మాత్రమే మిగులుగాక! నీవు మాత్రమే ఉందువుగాక! నేను కాని నా కోరిక గానీ ఉండకుండు గాక!

**గురుకుల శిక్షా ప్రణాళిక**

రాష్ట్రీయ జాగృతి మూలమున లభించిన స్వరాజ్య ప్రాప్తిలోఆర్య సమాజము ప్రారంభించిన గురుకుల ప్రణాళిక కూడ నొక గొప్ప సహకారమన వలయును. క్రీ.శ. 1900 సంవత్సరమున గుజరావాలాలో గురుకులము స్థాపింపబడెను. క్రీ.శ. 1902లో కాంగడీ గ్రామసమీపమున గంగాతటమున ఆ గురుకులము శిక్షణాలయ రూపమున ప్రతిష్ఠితమయ్యెను. ప్రారంభముననే గురుకుల మూల సిద్ధాంతములు రాష్ట్రీయభావనాత్మకములైనవిగానే స్వీకరింపబడెను. ఆశ్రమమున విద్యార్థులు గురువుల సంరక్షణలో నుండుట గురుకుల శిక్షా ప్రణాళికకు ప్రథమము ఆవశ్యకమునైన అంగముగా నుండెను. వారి వేషభూషలు భారతదేశానికి సంబంధించినవై సాదాగా నుండవలయును. విద్యార్థుల కొసంగబడు ఆధునిక విషయములకు సంబంధించిన శిక్షణ అంతయు రాష్ట్రభాషయైన హిందీలో ఇయ్యబడెడిది. సంస్కృత వాఙ్మయము, ఆర్యధర్మము ప్రతివిద్యార్థి యొక్క శిక్షణకు ముఖ్యాంగములై యుండెను. ఈ విశేషతయే యే జాతికైనను రాష్ట్రనిర్మాణ శిక్షలో ముఖ్యముగా నుండదగినది. గురుకులములో నిది మొదటినుండియు నుండెడిది. కాంగడీ గురుకుల స్థాపన తరువాత దేశమున ననేక స్థలములందు గురుకులములు వెలసినవి. దయానంద మహర్షి తనచే రచింపబడిన గ్రంథములలో నిర్దేశించిన సిద్ధాంతములే గురుకులములలో నన్నింటియందును స్వీకరింపబడెను. క్రీ.శ. 1906 నుండి 1919 వరకు

జరిగిన రాజనైతిక ఉత్థాన సమయమునందు రాష్ట్రియశిక్షామహత్త్వమును గుర్తించి భారతి ఆంగ్లేయ శిక్షణాలయములను బహిష్కరించి రాష్ట్రియ శిక్షణాలయముల నారంభింప మొదలిడెను' కాని అవి రాజనైతిక ఉత్థాన పతన ప్రభావములనుండి తప్పుకొన జాలకపోయెను. రాజనైతిక ఆందోళన ప్రబలినపు డవి శిక్షణాలయములుగ బాగుగ ప్రకాశించెడివి. పతన సమయమున నవియు శిథిలము లగుచుండెడివి. రాష్ట్రియ శిక్షణాలయములలో నూటికి తొంబది తొమ్మిది రాజనైతిక ఆందోళనకు సంబంధించిన ఉత్థాన పతనముల ననుసరించుచు లుప్తప్రాయము లయ్యెను. కాని గురకుల శిక్షణాలయములు మాత్రము రాజనైతిక ఆందోళన వలన నేర్పడు ఆఘాతపరంపరను నిరంతరము సహించుచు జీవించుటయేకాక క్రమవికాసమును సంపాదించుకొనగలిగినవి. అవి ప్రభుత్వముతో నెట్టి సంబంధము పెట్టుకొనక స్వతంత్రములై రాష్ట్రియ శిక్షాదీపమును నిరంతరము ప్రజ్వలింజేయుచుండెను. నేటి స్వాధీన భారత ప్రభుత్వ మీ సత్యము నంగీకరించినను అంగీకరింపకున్నను స్వరాజ్యము లభింపకమానదు. ప్రభుత్వనాయకు లెల్లరు "గురుకులములకు సంబంధించిన నిజమైన రాష్ట్రియ శిక్షణాలయము వాని యాధారభూత పద్ధతి మాత్రమే రాష్ట్రముయొక్క మానసిక దాస్యమునకు మందు" అని ముక్త కంఠముతో ఘోషించుచుండెడివారు.

## సంఘసంస్కరణము

మనదేశపు నైతిక పతనమునకు ముఖ్యకారణము సాంఘిక దురాచారములే యనుట సర్వసంమతవిషయము. పుట్టుకతో వచ్చు కులభేదములు, అస్పృశ్యతయనెడి భయంకరవ్యాధి, స్త్రీలు చదువరాదనుట వారియెడ సంఘమునందుగల నైచ్యభావము మున్నగు రోగ కీటాణువులు జాతిని ఎంతగా నిర్బలము చేసినవో చెప్పజాలము. జాతికి సంభవించిన

యీ రోగముల నివారణతోబాటు భారతజాతి స్వాధీనతను సమీపింప ప్రారంభించిన దనుటయు నెల్లరికి తెలిసిన విషయమే. రాజ్యక్రాంతి అంతిమ స్థితికి చేరువయైనపుడు ఈ సాంఘిక రోగములు బొత్తిగా నశింవకపోయినను వాని మూలములు మాత్రము తప్పక శిథిలములయినవని స్పష్టము కాదొడగెను. జాతిపంక్తి భేద బంధనములను తొలగించుటయందును, అస్పృశ్యతాభూతమును పారదోలుటయందును, స్త్రీలను శిక్షితలనుజేసి వారికి సంఘమున నున్నతస్థానము నొసంగుటలోను ఆర్యసమాజమన్ని సంఘములకంటె ముందంజవేసిన దనుటను ఆర్యసమాజ ఘోరవిరోధియు నంగీకరింపకపోడు. అర్వాచీన భారతమున మహర్షి దయానంద స్వామి ప్రథమ సంస్కర్తయై సాధారణ జనులలో కూడ సామాజిక జాగృతిని కలిగించెను. దయానందస్వామి గాంధి మహాత్మునికంటె అరువదియేండ్లు ముందు సమాజసంస్కరణ రూప మంగళాచరణము చేయనిపక్షమున సత్యాగ్రహము సఫలమయి యుండెడిదికాదు. భారతదేశమున నధికభాగములో సంఘసంస్కరణ యోజనలను కార్యాన్వితముచేయు శ్రేయస్సు ఆర్యసమాజమున కియ్యక తప్పదు.

ఇరువదియవ శతాబ్దాపు మొదటి నలువది సంవత్సరముల చరిత్రపై దృష్టిసారించినచో ఉత్తర భారతమున నెల్ల ప్రాంతములందును ఆర్యసమాజ కార్యకర్తలు సంఘసంస్కరణాగ్ర దూతలుగా మనకు కనిపింతురు. ఒకప్పుడు బడోదారాజ్యము శిక్షాప్రచారమునందును, సంఘసంస్కరణమునందును ముందంజవేసినట్లు అంగీకరింపబడుచుండెడిది. గాయక్వాడ సయాజీరావు మహారాజును సంస్కరణవైపునకు ప్రేరణచేసిన శ్రేయస్సు వారి మానసిక గురువు నిత్యానంద స్వామి మహారాజునకు లభించెనని తజ్ఞులు చెప్పుదురు. ఆ నిత్యానంద స్వామికి సంబంధించిన సంస్కరణల, యోజనలను

కేంద్రితము చేసిన మహానుభావుడు అమృతసర్‌కు చెందిన ఆర్యసామాజికుడైన రాజ్యరత్న పండిత ఆత్మారామ్ గారై యుండిరి. నిత్యానందస్వామి, పండిత ఆత్మారామ్ ఇరువురును ఆర్యసామాజికులే. ఇట్లే ఎక్కడెక్కడ సంఘసంస్కరణ దుర్ఘటమగుచుండెనో యటనట ఆర్యసమాజ కార్యకర్తలు మైదానమున దూకుచుండెడివారు.

**స్వామి హత్యకు కారణము**

సత్యాగ్రహ ప్రారంభకాలములో అందు ఆర్యసామాజకులు అసాధారణ ఉత్సాహముతో పాల్గొనినట్లు ఈ వ్యాసము మొదట వ్రాసియుంటిని. ఆయాందోళనము వారికి ధార్మిక భావనతో ఓతప్రోతమై యున్నట్లు తోచి యట్లు చేసిరి. క్రీ.శ. 1922-23 సంవత్సరములో ఆయాందోళన శిథిలమైనందున నొక క్రొత్త పరిస్థితి యేర్పడినది. యూరపు మహా యుద్ధమున విజయము సాధించిన మిత్రరాజ్యములు ఖిలాఫత్‌ను నాశనము చేసి భారతదేశపు ఖిలాఫత్ అందోళమునంతము చేసిరి. సాధారణ మహమ్మదీయులును ఖిలాఫత్ పేరుతోనే కలిసి గాంధీ మహాత్ముని సత్యాగ్రహాందోళనము నందును పాల్గొనిరి. కాని ఖిలాఫత్ అంతముకాగానే మహమ్మదీయలు కాంగ్రెసునుండి వైదొలగిరి. కాని వారిలో సంఘీభావము దృఢపడెను. వారిపై మౌల్వీల ప్రధానత చరమ సీమ నందుకొనినది. ఈ పరిస్థితిలో భారతదేశమున సాంప్రదాయక సంఘర్షణ ప్రారంభమయ్యెను. మలబార్, ముల్తాన్ మున్నగు ప్రాంతములలో హిందువులపై భయంకరమైన అక్రమణలు జరిగెను. అప్పుడు జీవిత సంస్థయైన ఆర్యసమాజము శాంతిపూర్ణములయిన ఉపాయములతో ఆ యాక్రమణలకు ప్రతిరోధమేర్పరుప గలిగెను. దీనిని మొదట మహమ్మదీయ నాయకులు, వారి దృష్టితోనే జూచు రాజకీయ నాయకులు కొందరు ఆర్యసమాజము మీద దోషారోపణ జేయదొడగిరి. జైలునుండి

బయటపడిన మౌలానా మహమ్మద్‌అలీ, మౌలానా షౌకత్ అలీ సోదరులు పైకి రాష్ట్రవాదులుగా కనబడుచు, హృదయములందు సంప్రదాయ వాదులైన మహమ్మదీయులకు నాయకులైరి వారు చెప్పిన మాటలను నమ్మిగాంధీ మహాత్ముడు కూడ ఆర్యసమాజమును దోషిగా నిశ్చయించెను. తన యీ నిశ్చయమును మిక్కిలిగా త్వరపడి "యంగ్ ఇండియా" లో ప్రచురించెను. మహాత్ముని యీ ఏక పక్షీయ లేఖ ఆర్యసామాజికుల హృదయములకు మిక్కిలి బాధకలిగించెను. ఆ లేఖ ద్వారా గాంధీ మహాత్ముడు వాస్తవముగ ఆర్యసమాజమునకు మిక్కిలి యన్యాయ మొనరించిన వాడయ్యెను. అందువలన నాయన తరువాత తన లేఖలమూలమున ఆదోషమును పరిమార్జనమును చేయుటకు యత్నించెను. కాని తన మొదటి లేఖవలన నాటిన కంటకములను దూరము చేయజాలక పోయెను. ఆ లేఖవలన ఏర్పడిన సుదూర పరిణామములలో మనము శ్రీ శ్రద్ధానందస్వామి, రాజపాల్ మహాశయుల హత్యలు గణింపవచ్చును.

ఆర్యసామాజికుల రాష్ట్రియ భావన మిక్కిలి గంభీరమైనది. కాని పక్షమున పైన వర్ణించిన ఘటనల పరిణామరూపమున ఆర్యసమాజ సదస్యులు రాష్ట్రియ ఆందోళనము నుండి విముఖులై యుండెడివారు. వారి రాష్ట్రియత రాజకీయ నాయకుల సామయిక లేఖల మీద ఆధారపడినది కాదు. అది దయానంద మహర్షి ద్వారమున నేర్పడిన నిష్కలంక దేశభక్తిపై ఆధారపడినది. అందువలననే రాజనైతిక నాయకులలో కొందరి వ్యవహారముతో నసంతుష్టలయినను ఆర్యసామాజికులు స్వాధీనతా సంగ్రామమునుండి వేరుకాజాలక పోయిరి. వారు నిరంతరము పాతిక సంవత్సరముల వరకు జరిగిన యెల్లపోరాటము లందును గాంధీ మహాత్ముని నాయకత్వము నంగీకరించి సహకరించుచునే యుండిరి.

దూర దృష్టిలేని రాజకీయ నాయకుల దుర్వ్యవహారము కారణముగ స్వాధీనతా యజ్ఞమున తనను ఆహుతి నొనర్చుటకు వెనుకంజ వేసిన ఆర్యసామాజికుని ఒక్కనిని గూడ నేనెరుగను. స్వరాజ్యమహిమ అంతిమ సఫల సమాప్తి వరకు దయానంద మహర్షి శిష్యులు తమ ధర్మముగా నెంచి సేవ యొక్క అగ్రిమ శ్రేణిలో ముందంజవేయుచునే యుండిరని దృఢముగా చెప్పవచ్చును.

## నిజామ్‌ను ఖలీఫాగా నెంచుట

భారత దేశ స్వాతంత్ర్య ఘోషణానంతరము ఆర్యసామాజికుల అద్భుత దేశభక్తిని ప్రకటించు సమయము మరియొకటి సంభవించెను. ఐరోపా ఖండమునకు సంబంధించిన దేశములు టర్కీ ఖలీఫాను అంత మొనర్చు సమయమున భారతదేశపు మహమ్మదీయులు హైదరాబాద్ నిజామ్‌ను ప్రపంచమున కంతటికి ఖలీఫాగా అంగీకరించుడని ఆంగ్లేయ ప్రభుత్వము నెదుట ఒక తీర్మానమును ప్రతిపాదించిరి. ఆ సమయమున నిజామ్ కూడ ఆ తీర్మానమును ప్రతిఘటింపడయ్యె. అందువలన భారతదేశపు మహమ్మదీయులు, నిజామ్ ఇరువురు నీ విషయమున సంమతి కలిగిన వారైనట్లు స్పష్టమయ్యెను. అవకాశములభించినచో హైదరాబాద్ శాసకుని పేరు భారతదేశమున ఉన్నతపథమున నలంకరింప జేయ జూచిరి. ఆంగ్లేయులు భారతదేశమును విడిచి పోయిన పిమ్మట వారిలో నిద్రించియున్న భూతము మేల్కొనెను. నిజామ్ అతని సహచరులు భారతమున వేరుగ స్వాతంత్ర్య పతాకమును ఎగురవేసిరి. దరిద్రులైన ప్రజల రక్తమును త్రాగి ప్రోగుచేసిన స్వర్ణభండార సహాయముతో నిజామ్ ఆకతాయులైన రజాకారుల సేననొక దానిని సమకూర్చెను. ఆ సేన హైదరాబాద్ రాజ్యమునందు నివసించు హిందువులను కొట్టి వారి ధనసంపదలను దోచుకొన నారంభించెను.

భారత ప్రభుత్వము నిజాం రాజ్యముపై పోలీసు చర్య (Action) ప్రారంభింపక పూర్వము ఆర్యసామాజికులు లా సంస్థానమున ప్రాణములను అరచేతనుంచుకొని రంగమున ప్రవేశింపకున్న పక్షమున ఆ రాజ్యమునందలి హిందువుల దుర్దశ వర్ణింపనలవికాక యుండెడిది. ఆకొలది సంకటమయ దినములలో ఆర్య నవయువకులు రజాకారుల దుండగముల నెదుర్కొని పరిస్థితి నెంతగానో కాపాడి యుండిరి.

హైదరాబాద్‌ను రజాకార్ శాసనము నుండి స్వతంత్రము చేయుటలో ఆర్యనవయువకులు చేసిన ప్రశంసనీయ కార్యములు చరిత్రలో ప్రకటింప బడకున్నను విస్మరణీయము లెన్నడును కాజాలవు.

**నిష్కామ బలిదానము**

భారతదేశ స్వాతంత్ర్యము కొఱకు ఆర్యసామాజికులొనర్చిన బలిదానములకు ప్రేరక కారణము స్వార్థ మెన్నడును కాదు. అది కేవలము ధర్మము. వైదిక ధర్మియైన ఆర్యుడు నిత్యము నిట్లుదేవుని ప్రార్థించును. "అదీనాః స్యామ శరదః శతమ్" దాస్యజీవనము - దీనజీవన మతని ధర్మమునకు ప్రతికూలము. ఇట్టి ధర్మముతోనే ప్రేరితులై అపనిందలకు పాలైనను భీతిచెందక నేటివరకును కర్తవ్య పాలన మొనర్చుచునే యున్నారు. ఇకముందును ఇట్లే ప్రవర్తింపగలరని ఆశించుచున్నాము. ఇంతవరకును ఉద్యోగాపేక్షతో గాని, పదవీ కాంక్షలతోగాని, ఆర్యసామాజికులు ప్రేరితులు కాలేదు. ఇక ముందును నిజమైన ఆర్యుడట్లు కాజాలడు. వారు స్వాధీనతను ధర్మముగా నెంచి యందులకు పోరాడిరి. భవిష్యత్తు నందును రాష్ట్రము సంకటము నెదుర్కొనవలసి వచ్చిన అట్టి విశుద్ధ ధార్మిక భావనచే ప్రేరితులై కార్యక్షేత్రమున ప్రవేశింతురని విశ్వసింపనగును. దయానంద మహర్షి అనుయాయులకు ఈ యాశయే శోభ నొసంగును.

# స్వరాజ్య సందేశము - ఆర్యసమాజము

రచన : కళాప్రపూర్ణ పం. గోపదేవ్ శాస్త్రి

*ధర్మ ఏవ హతో హన్తి, ధర్మో రక్షతి రక్షితః ।*
*తస్మాద్ధర్మో నహంతవ్యో మా నో ధర్మో హతోzవధీత్ ॥*

ధర్మహాని జీవనహాని, ధర్మ రక్షణ జీవన రక్షణ. కావున ధర్మ హాని తగదు. హత ధర్మము మానవ జీవనమును హతము జేయకుండునుగాక.

ధర్మము చతుర్విధ పురుషార్థములలో మొదటిది. అధర్మ జీవనము పశు జీవన మనబడును. అందువలననే యొక కవి యిటు నుడివి యున్నాడు.

ఆహార నిద్రా భయ మైథునాని సామాన్య మేతత్ పశుభిర్నరాణాం ।
ధర్మో హి తేషా మధికో విశేష ః ధర్మేణ హీనాః పశుభిః సమానా ః ॥

ఆహారము, నిద్ర, భయము, సంతానోత్పత్తి కనువగు క్రియయు నను నీ నాలుగింటిలో మానవులకును నితర ప్రాణులకును నెట్టి భేదము లేదు. మానవులలో ధర్మమనున దొక్కటియే విశేషము. అది లేని మానవులు పశుతుల్యు లని కవి యభిప్రాయము.

కావున ధర్మ పరిరక్షణ మానవ జీవన లక్ష్యములలో ప్రాథమిక మైనది. మానవులు జీవన నిర్వాహణమునకై అర్థ కామములను సైత మర్థింతురు. అందువలన అవియును పురుషార్థములు - పురుషునిచే నర్థింపబడునవిగా లెక్కింపబడినవి. కాని, యవి ధర్మయుక్తము కానినాడు అనర్థములగును. ధర్మ పూర్వకములైన మోక్ష దాయకములగును. కావుననే భారతీయులకు ధార్మిక జీవనము ప్రాణప్రదము ఋషులు, మునులు ధర్మమును మోక్షదాయకముగానెంచి దార్మికులైరి. అందువలననే

కణాదుడు

"యతోऽభ్యుదయ నిఃశ్రేయస సిద్ధిః స ధర్మః"

అభ్యుదయ నిఃశ్రేయస సిద్ధికి సాధనము ధర్మమని చిత్రించి యున్నాడు.

నేడు విశ్వమానవులలో విజ్ఞాన కాంక్ష మిక్కుటముగా నున్నది. రష్యా ,అమెరికా, ఇంగ్లాండు, జర్మనీ మొదలగు దేశము లీ విజ్ఞాన క్షేత్రమున నెంతో అభివృద్ధిని సాధించినవి. అర్థ సంపాదనలోకూడ నొక దేశమును మరియొకదేశము మించుచున్నది. మిక్కుటమగు ధనము నుపయోగించి విజ్ఞాన రంగమున ననేకములగు చిత్ర విచిత్ర వస్తుజాతము నావిష్కరించుచున్నారా యా దేశవాసులు. సమీపములో నున్న గ్రహాంతరముకు కూడ పయనము చేయ ప్రయత్నించుచున్నారు. కాని ధర్మ దృష్టి మానవులలో క్షీణించినది. అర్థదృష్టి పెరిగినది. జీవన మర్థమయ మగుచున్నది. అర్థముతో పాటు కోరికలు - కామనలు పెరుగుట సహజము, దాని ఫలితముగ మానవుడుభూతమున తృప్తినొందక గ్రహాంతర గమనమున కుద్యుక్తుడగుచున్నాడు. ధర్మవిరహితములగు నర్థకామములు మానవునకు లోకమునందును మోక్షదాయకములు - సుఖ సాధనములు కావు, ఇయ్యది భారతేతర దేశవాసులు గుర్తించినట్లు కానరాదు.

ప్రస్తుత భారతదేశము కూడ యితర దేశముల ననుసరించుటలో తన శ్రేయస్సు గలదని యెంచుట దురదృష్టము. ధాన్యముల నభివృద్ధి నొనర్చుటలో నేమి, భౌతిక విజ్ఞానము నాకాంక్షించుటలో నేమి, విద్యా విధానముల నేర్పరచుటలో నేమి, వస్తుసంపదను పెంచుటలో నేమి, భారత నాయకులకు పాశ్చాత్య దేశానుకరణము పరమలక్ష్య మైనది. పరిపాలన పద్ధతియే అమెరికా, బ్రిటనుల ననుసరించి రచియింపబడినది. మన నాయకులెల్లరు పాశ్చాత్య విద్యా విభూషితులగుటంజేసి వారంతకు మించియాలోచింపజాలకున్నారు. మౌలికత (స్వంత ఆలోచన) వారిలో

పూజ్యం. ఆర్షదృష్టి యింతకంటెను సున్న. ఆలోచనలలోను, విధాన నిర్మాణములోను, నిశ్చిత సిద్ధాంతముల నాచరించుటలోను, అన్నింటను పాశ్చాత్యానుకరణమే కాని భారతీయత యనునది దేశనాయకులందు కనిపింపకుండుట శోచనీయము. అందువలననే భారతీయులలో కూడా విద్యావంతులు నేడు ధర్మచింతన, ధర్మచర్యలు, ధర్మాచరణము అన్నియు శ్రేయోదాయకములని యెంచకపోగా ననర్థ దాయకములనియు ధర్మాచరణకు ప్రయత్నించుట వెనకకు బోవుటయనియు, ప్రగతి సాధనము కాదనియు నెంచుచున్నారు. బౌద్ధ, జైన, చారువాక (భౌతిక) క్రైస్తవ, మహమ్మదీయాది మతమతాంతరములనెడి వాగురు (వుచ్చు) లలో జిక్కి యధార్మికులై భారతీయులు జీవన లక్ష్యమునకు దూరులగుచున్న విచారింపకున్నారు. రాత్రింబవళ్ళు అర్థం, కామం తక్క వేరొక విషయమే వారికి గోచరింపకున్నది. అర్థకామములు వలదని మా యభిప్రాయము గాదు. అర్థ కామములు పురుషార్థములలో ప్రాచీన భారతీయులు గణించియున్నారని ప్రప్రథమముననే నుడివి యున్నాము కదా! కాని యర్థకామములు ధర్మయుక్తములు కావలెను. అట్లు కానినాడు అవి యనర్థములగు ననియు నటనే వచించి యున్నమాట మరువరాదు. ధర్మాపేతములైన (ధర్మములేని) అర్థ కామములు పాశ్చాత్యదేశములలో నింతకు పూర్వము కలిగించినట్టియు, నిప్పుడు కలిగించుచున్నట్టియు ముందు కలిగింపనున్నట్టియు ననర్థములు విజ్ఞులకు కండ్లకు కట్టినట్లు కనబడుటలేదా ? అధర్మోపేతులైన వారి చేజిక్కిన అణుబాంబు హిరోషిమా హత్యాకాండకు కారణ ముకాలేదా ? లక్షలాది మానవ ప్రాణులను కూడా నామరహితం చేయలేదా ? ఫ్రాన్సు దేశవాసుల అణుబాంబుల పరీక్షణలు ఈజిప్టువాసుల మొరలాలకించుచున్నవా ? ధర్మాపేతులైన తెల్లవారి శాసన కార్యముచే చేయు నీగ్రోల మారణ హోమము నిత్యము పత్రికా ముఖమున చూచుట లేదా ? ధర్మాపేతమగు మత వైషమ్యము

నిత్యకలహములకు దారితీయుట కనులార గాంచుటలేదా ? వీటి కన్నిటికి మూలము ధర్మయుక్తము కాని యర్థకామముల ప్రాబల్యము కాదా ! కాకున్న మరొక కారణమేమో విజ్ఞులు వివరింపగలరా ? కాబట్టి అర్థకామములు ధర్మ సంయుతములు కావలయు ననుటయే పై వాక్యముల అభిప్రాయము.

"ధర్మము అభ్యుదయ నిఃశ్రేయస్సులకు సాధనము" అను మహర్షి వాక్యము పూర్వమే యుల్లేఖించియుంటిమి. అభ్యుదయ మిహ పరాభివృద్ధి, ఐహికాముష్మిక, సుఖ సంపదలకు తోడ్పడునది ధర్మమగును. ఇట్లు సుఖ సంపదల నభివృద్ధి నందించుచు, దుఃఖలేశములేని సుఖము నొనగూర్చుటయే దాని పరమావధి.

ఆ ధర్మమును తెలుపునది వేదము, "వేదోఖిలో ధర్మమూలమ్" సమస్త వేదములు ధర్మమూలము, ధర్మసాధనమని మనువు వాక్యము, వేదములు మానవులకు ధర్మమున ప్రవృత్తి కల్గించుటకై సర్గారంభమున నీశ్వరునిచే ప్రసాదింపబడిన జ్ఞానరాశి. భారతదేశమున వేద ప్రచారము జరిగినంతకాలము దేశమున ననర్థములకు తావు లేకుండెను. అది సన్నగిల్లిన కొలది భారతదేశము దుఃఖములపాలయినది. క్రమముగ పరాధీనమై ప్రపంచమున తన యస్తిత్వమునే కోల్పోయినట్లయినది. బహుకాల మిట్లు దురవస్థలపాలై చివరకు నవయుగ ప్రవర్తకులయిన దయానంద మహర్షి ప్రభృతి మహా పురుషుల ప్రయత్న ఫలముగ నేడు మన మందరము స్వతంత్ర వాయుమండలమున తిరుగాడుచున్నాము. దేశ స్వాతంత్ర్యమునకు పాటుపడిన సంస్థలలో మహర్షి దయానంద స్థాపితమైన (ఆర్యసమాజము) "అగ్రగణ్యమనుట అసత్యముకాదు. దేశీయ నరేశులలో విజ్ఞానము కల్గించి, దేశ ప్రేమను వారి హృదయములలో నాటి, దేశ స్వాతంత్ర్యము కొరకు వారి నేకముకండని, ప్రప్రథమమున బోధించిన మహనీయుడు దయానందుడు. పారతంత్ర్య శృంఖలముల

నుండి దేశమును విముక్తి యొనర్చుటకై దేశ ప్రజలందరు స్వదేశ వస్తువులను వాడుట యవసరమని బోధించినవాడు దయానందుడే. దేశ విముక్తికి పరభాషను వదలి, స్వదేశ విద్యలను నేర్చుట ముఖ్యమని యెంచి, గురుకులమునుస్థాపించి, జాతీయ విద్యకు బీజములు వేసినవాడు దయానందుడే. పారస్పరిక వివాదములను పరిష్కరించుకొనుటకు బ్రిటిష్ పద్ధతుల నవలంబించు న్యాయస్థానముల కేగవలదని చెప్పి కోర్టులను బహిష్కరించిన మహానీయుడు దయానందుడే. భారతదేశమునకు రాష్ట్రభాష ఇంగ్లీషు కాకూడదనియు, దాని స్థానమును ఆర్యభాష (హిందీ) ఆక్రమించుకొనవలె ననియు నుద్బోధించినవాడు దయానందుడే. కులమమత వైషమ్యములు, జాతి భేదములు, అస్పృశ్యత వంటి యమానుషాచారములు భారత గౌరవమును కళంకిత మొనర్చిన వని యెంచి వానిని కూకటి వేరులతో పెరికివేయ నిరంతరము దీక్ష వహించి కృషి యొనర్చినవాడు దయానందుడే. అవైదికములు ననార్షములునగు జడదేవతా పూజలు, అనేక దేవతా వాదములు, వ్యక్తి పూజలు అవతారవాదము, మానవుని ప్రగతికి ఆటంకములై యభ్యున్నతి నరికట్టి జడుల నొనర్చినవని చెప్పి, వాని నిర్మూలమొనర్ప యత్నించుచు తుదకు నందులకే జీవనము నర్పించినవాడు దయానంద మహర్షియే. ఇవియేకాక యిట్టి మహోన్నత లక్ష్యము లనేకములు సాధించుటకుగాను కాంగ్రెసు కంటె అనేక వర్షములముందు దయానందు డీదేశమున ఆర్యసమాజమును, ప్రజాస్వామ్య పద్ధతులపై స్థాపించి యున్నాడు. "స్వరాజ్యము నా జన్మహక్కని" చెప్పిన లోకమాన్య బాలగంగాధర తిలకు కంటె పూర్వము స్వరాజ్యపదము ప్రప్రథమమున నుచ్చరించిన మహానీయు డని చెప్పుకొనబడు దాదాభాయి నౌరోజీకంటె పూర్వమే.

"కోయీ కిత్‌నాహీ కరే పరంతూ జో స్వదేశీయ రాజ్య హెూతాహై

వహ సర్వోపరి ఉత్తం హెూతా హై! అథవా, మత మతాంతర్‌కే ఆగ్రహరహిత, అపనే ఔర్ పరాయే కా పక్షపాత శూన్య, పితా మాతాకే సమాన్ ప్రజాపర్ కృపా, న్యాయ్, ఔర్ దయాకే సాథ్ విదేశియోంకా రాజ్యభి పూర్ణ సుఖదాయక నహీ౦హై"

"ఎవడెంత జేసినను స్వదేశీయ రాజ్యమే యన్నింటికి మించి యుత్తమ మగును. మతమతాంతరముల నిర్బంధములేక, స్వపర పక్షపాత శూన్యమై తల్లిదండ్రుల బోలి ప్రజలను కృపతోను, దయతోను, న్యాయము తోనూ జూచునదైనను విదేశీయుల రాజ్యము పూర్ణ సుఖమును నొసంగజాలదు' అని యెలుగెత్తి చాటుటయేకాక సత్యార్థ ప్రకాశమున నాపదముల నంకిత మొనర్చిన దివ్య ద్రష్ట దయానందుడు కాక మరియెవడు? ఇట్టి పవిత్ర ధర్మములను ప్రబోధించుటకే యా మహర్షి ఆర్యసమాజమును స్థాపించి యున్నాడు. ఈ పరమ ధర్మములను ప్రచారమొనర్చి, దేశాభ్యుదయమునకు పాటుపడి, ప్రవాస శిక్షలకు గురియైన పంజాబ్ కేసరి లాలా లజ్‌పత్ రాయ్ నీ దేశమునకు ప్రసాదించినది ఆర్యసమాజమే! సర్వస్వమును త్యజించి గంగాతీరమున గురుకులమును స్థాపించి, జాతీయ విద్యా ప్రభోధమును ప్రాతిపదికగ నేర్పరచుటయేకాక జాతీయోద్యమమున బ్రిటిష్ వారొనర్చిన యత్యాచారములను సహింపజాలక ఢిల్లీ చాందిని చౌక్‌లో బ్రిటిష్ మిషన్‌గనుల ఎదురుగా రొమ్మువిరచి నిర్భయముగ నిలబడిన ధీర పురుషుడగు శ్రద్ధానందుని దేశమునకు కానుకగా నిచ్చినది ఆర్యసమాజమే. మహా మేధావియైన గురుదత్త విద్యార్థిని, ధర్మప్రాణులైన పండిత లేఖరాముని, భగత్‌సింగ్ ప్రభృతి సాహసికులగు దేశభక్తులను, విజ్ఞాన వేత్తలను, సత్యనిష్ఠకలవారిని దేశమున కర్పించినది ఆర్యసమాజమే. విజ్ఞానము విరివిగా వ్యాపించిన ఈరోజులలోకూడ విద్వాంసులకు తత్త్వవేత్తలకు, విభ్రమము కలిగించు

వేద విజ్ఞానమును పునరుద్ధరించి లోకమున కందజేయు నిరంతరకృషి నొనర్చినది ఆర్యసమాజమే. బాల్య వివాహములను నిషేధించి, ప్రౌఢ వివాహము లాచరణీయములని బోధించు శారదా బిల్లును ప్రప్రథమమున ప్రవేశ పెట్టినది ఆర్యసమాజమే. ఇదియదియననేల దేశాభ్యుదయమునకై సర్వతోముఖమగు నాందోళనల ప్రారంభించినది ఆర్యసమాజమనిన నతిశయోక్తి యావంతయులేదు. నేడు రాష్ట్రపితయని దేశభక్తులు గుర్తించు గాంధీమహాత్ముడార్యసమాజము ప్రారంభించిన ఉద్యమములనే బలపరచినాడనిన విజ్ఞులాశ్చర్య పడరు. ఇట్టిది యీ ఆర్యసమాజము, స్వరాజ్యము ప్రాప్తించి నందున నిక నీ ఆర్యసమాజ ప్రయోజన మేమి? యని సందేహింప బనిలేదు. స్వరాజ్యము ప్రాప్తించిన విషయము వాస్తవమే. కాని ప్రజలలో స్వదేశప్రేమ యంకురించినట్లు కానరాదు. స్వార్థమును వీడి దేశాభ్యుదయమే తమ అభ్యుదయమని ప్రజ లింకను గుర్తింపకున్నారు. దేశమునగల విద్యావంతులు, ధనవంతులు, తమతమ విద్యా, ధనములు మూర్ఖులను, నిర్ధనులను మోసగింప వినియోగించు చున్నారే కాని వారి యభివృద్ధికిగాను వినియోగింపకున్నారు. కుల, మత కక్షలు పూర్వకముకంటె పెరుగుచున్నవి కాని, నశింపవయ్యె. పరదేశములు నేడు పూర్వముకంటె నెక్కుడు తమ ధనమును బుద్ధిని వినియోగించి దేశీయులను పెడదారులను పట్టించుచున్నారు. విమతస్థుల నొనర్చు చున్నారు. విజాతీయతను వారి హృదయమున నంకురింపజేయు చున్నారు. విద్యాదాన నెపముతో, చికిత్సావ్యాజముతో, ఆహార పదార్థముల నందజేయు చున్నామను సాకుతో బీద జనులలో, మూర్ఖులలో క్రైస్తవులు అరాష్ట్రీయ భావనలను రేకెత్తింప జేయుచున్నారు. ప్రజలలో, ప్రభుత్వములో నన్నిచోట్లను దేశసంపదలు దుర్వినియోగం చేయబడుచున్నవి. విజ్ఞాన నెపముతో నాస్తికత్వము దిన దిన ప్రవర్ధమాన మగుచున్నది. నవ నాగరికత పేరుతో విజాతీయత

భారతీయులలో విలువకు వచ్చుచున్నది. సాత్విక జీవనము నానాటికి సన్నగిల్లి కృత్రిమ జీవనము, కుటిల ప్రవర్తనలు, కులాచారము లగుచున్నవి. ఇట్టియెడ నార్యసమాజము చేయవలసిన దెంతయో యున్నది. ఈ సమాజ మితర ప్రాంతములందు జేసిన పని అధికము. మన యాంధ్రప్రదేశమున నీయది ప్రజలదృష్టి నాకర్షింపకుండుటకు కారణ మూహింపజాలకున్నాము. ఆంధ్రులారంభశూరులని ప్రసిద్ధి. ఈ విషయమున నాసూక్తియు చరితార్థము కాదయ్యెను. మన గ్రామములలో నాహారమునకు కొరతలేదు. వస్త్రముల కభావములేదు. చదువులకు న్యూనత లేదు. నాగరికతకు క్షతిలేదు. అన్ని యున్నవి కాని జీవనములో సౌందర్యములేదు. జనులలో పరస్పర విశ్వాసములేదు. జీవనము ధర్మబద్ధముకాదు. నిత్యజీవనములో శీలమునకు గాని, సత్ప్రవర్తనకు గాని తావు కాన్పింపదు. అందువలననే జీవన సౌఖ్యము అనుభవింప లేకున్నారు. కాబట్టి జీవన సౌఖ్యము నొనగూర్ప నార్యసమాజ మెంతవరకు తోడ్పడునో బుద్ధిమంతు లాలోచింపుడు. సమాజ సిద్ధాంతములను సహన భావములతో పరిశీలింపుడు. సత్యము నన్వేషింప బూనుడు. అవిద్యను తొలిగించి విద్యావ్యాప్తికి బూనుకొనుడు. దేశమును విజ్ఞానముతోబాటు, ధర్మాచరణతో శోభిల్ల జేయుదురు గాక.





ఆర్యసమాజ సిద్ధాంతాలలో స్వదేశీ ప్రేమ నిండి ఉంది. ఆర్యసిద్ధాంతములు, ఆర్యశిక్షణలు రెంటిలోను ప్రాచీనభారత యశస్సు గానము చేయబడినది. ఆ విధంగా వారి అనుయాయులలో రాష్ట్రీయ గౌరవ భావన జాగృతి చేయబడినది. ఈ శిక్షణ వలన వారి దేశ చరిత్రలో పరాభవ కథలే లేనట్లు తెలిసికొన గలరు. దేశభక్తి, రాజనీతి పర్యాయ వాచకాలు కావు రాష్ట్రీయత దేశభక్తిలో ప్రవృత్తి కలిగి యుండుట రాష్ట్రీయ గర్వభావనా జాగృతి స్వాభావిక పరిణామమే.

- బ్లంట్ (జనగణన అధ్యక్షుడు)

జనగణన నివేదిక 1911,

వాల్యుమ్ 15, పార్ట్ 1, చాప్టర్ 4, పేజ 135